# మేఘసందేశము

(కాళిదాస మహాకవి రచనకు తెలుగుసేత)



అయినంపూడి గురునాథరావు



కమలా పబ్లికేషన్సు
విజయవాడ - 2.

ప్రథమ ముద్రణ
వెయ్యిప్రతులు

వెల రు. 1–25
పోస్టేజీ అదనం

జూలై 1964

ముద్రణ
మినర్వాప్రెస్, మచిలీపట్నం.

ప్రచురణ
కమలా పబ్లికేషన్సు
చోడవరపు దేవల్రాజ
గారి స్ట్రీట్,
విజయవాడ-2.

# వినతి

కావ్యప్రపంచ శేఖరమైన మేఘదూతమునకు ప్రాచీన కాలమున వెలసిన వ్యాఖ్యలు అసంఖ్యాకములు. అగాధమైన కవిహృదయమును తమ తమ దర్శనావధిగ అభివ్యక్తి మొనరించుటకు ప్రాచీనులైన మహాపండితు లనేకులు ప్రయత్నించిరి.

సంస్కృతమున మల్లినాథుని యొక్కయు, దాని ననుసరించి తెలుగున వెలువడిన వేదము వారియొక్కయు వ్యాఖ్య తప్ప మిగిలిన వేవియు కాలవాహిని నెదుర్కొని నిలువ ద్రొక్కుకొన జాలినవికావు. అగాధ రత్నాకర గంభీరమైన కావ్య హృదయమును ఆవిష్కరించుటలో నివియును అసమగ్రములని అభిజ్ఞులకు తెలియని విషయముగాదు.

ఆధునిక కాలమున అట్టి కావ్యహృదయమును తలస్పర్శిగా పరామర్శించి అందలి అనర్ఘమాలిక సంపదను గంపలకెత్తిన వారిలో వంగవసుంధరయందు శ్రీ అరవింద రవీంద్రులును, ఆంధ్ర వసుంధర యందు శ్రీ ముట్నూరి కృష్ణారావుగారును అగ్రగణ్యులు.

శ్రీ కృష్ణారావుగారి అపూర్వ కావ్య సమీక్షాపథమున, మహావనస్పతి తుల్యులైన 'వంగ' కవి శేఖరుల ఛాయలు ఎడనెడ దట్టముగా గోచరించెడి మాట వాస్తవము కాని, వారిని అధిగమించి శ్రీ కృష్ణారావుగారు ఒంటరిగా ఘంటాపథస్వైరవిహారముచేసిన తావులు పెక్కులు. శ్రీ కష్ణారావుగారు శాకుంతలము, కుమార సంభవము, మేఘ సందేశము మున్నగు వానిపై వెలయించిన అనర్ఘ వ్యాస రత్నములను సమాహిత చిత్తవృత్తితో పరామర్శించుట కుద్యమించిన వారికి నిందలి యాథార్థ్యము కరతలామలకము.

లోకాతిశాయి రమ్యతా నివాస భూమిగా మహాకవి రచనలపై ఈ దృశరచనలు తెలుగులో నింతవరకు ఉదయించలేదు. ఇక ముందు ఉదయించవలసిన ఆవశ్యకతయు నున్నట్లుతోచదు. అచ్చమైన కావ్యరసాస్వాదనమే గమ్యముగా గల విద్యార్థు లెల్లరును తప్పనిసరిగా చదువ వలసినదను అచంచల విశ్వాసము కలిమి, ఈ అనర్ఘ వ్యాసమును ఈ అనువాదమునకు పరిచయ ప్రాయముగా ప్రకటించితిమి. మా యీ ప్రయత్నమునందలి ఓగాములను తేల్చి చెప్ప వలసిన బాధ్యత సహృదయులైన పాఠకులది.

—ప్రకాశకులు

# మేఘ సందేశము - సమీక్ష

"మేఘదూత" యందు వర్ణితమైన జీవనధార మధుర మైన మందాక్రాంతావృత్త రూపమున తరంగితమైనది. రామగిరిశీతనగమధ్యస్థమైన ఆ ప్రాచీన భరత వర్షముండి యక్షునివలె మనము ఒక వర్షఋతువునందేగాక, సంతత ప్రవాసులమైతిమి. ఎచ్చటి యుపవనముల వెలుగులలోని కేతకీవృక్షపంక్తులు తెల్లని పూలరేకులతో శోభిల్లుచుండెనో, ఎచ్చట ప్రావృట్కాలమునకు బూర్వమే గ్రామరథ్యలలోని చెట్లు గూండ్లను కట్టుకొను కాకాదిగ్రామపక్షుల కలకలములచే నాకులితములయ్యెనో, ఎచ్చటి గ్రామపరిసరముల జంబూవనములు విస్తారముగబండి నల్లని మేఘములవలె నొప్పుచుండెనో, అట్టి దశార్ణదేశ మెచ్చటికి బోయినది? వత్సరాజుయొక్క వాసవదత్తాపహరణము మొదలైన అద్భుతోపాఖ్యానములతో వినోదపఱచు కథాకోవిదగ్రామ వృద్ధులుగల ఆయవంతీపుర మేమైనది? ఆశిప్రానదీ తటవర్తిని యగు ఉజ్జయినీ నగరరాజమో? నేడది సమస్త వస్తుసంపూర్ణమై బహువైశ్వర్యములతో తులతూగుచుండినమాట నిజమే కాని, అంతమాత్రముచే మన స్మృతి సంపూర్ణమగునా?

జాలోద్గీర్ణై రుపచితవపుః కేశసంస్కారధూపైః
బంధుప్రీత్యా భవనశిఖిభిర్దత్తనృత్తోపహారః
హర్మ్యేష్వస్యాః కుసుమసురభి ష్వధ్వఖేదం నయేథాః
పశ్యన్ లక్ష్మీం లలితవనితాపాదరాగాఙ్కితేషు.

[ ఓ మేఘుడా ! ఉజ్జయినీనగరహర్మ్యాగవాక్షముల నుండి వెడలు కేశసంస్కారధూపముల పరిపుష్టశరీరుడవై, నెయ్యంపు బెంపున నేత్రోత్సవముగ నీయెదుట నృత్యము చేయు పెంపుడు నెమిళ్ల నృత్యసేవ లంగీకరించి, గృహాలంకారార్థమై చల్లబడిన పువ్వుల పరిమళముచే ఘ్రాణతృప్తి యొనర్చుకొనుచు, దర్శనీయములగు అందకత్తెల పాదముల లత్తుకజాడలు కనులపండువొనర్ప ఉజ్జయినీనగరశోభను గాంచుచు నా హర్మ్యములందు విశ్రాంతియు, వినోదము పొందగలవు.]

ఆ లలితవనితల కేశసంస్కారధూపముల పరిమళము లేశమైనను నేడు మన ముకుపుటముల జొరకున్నదిగదా ! అంధకారబంధురములైన నిశీథసమయములందు ఆ భవనశిఖరములపై బరుండియుండు పారావతముల సుఖనిద్రయు, ఆ విశాలనగరపరిత్యక్తపథముల నిస్తబ్ధతయు నొకింత స్మృతికి దెచ్చుకొందుమేని, ఆ రుద్ధద్వారసుప్తసౌధములనుండి ఆనిర్జన రాజపథములందలి సూచీభేద్యములై నతమస్సులగుండ ఉద్రిక్త కామలై స్వయముగ కాంతార్థినులై ఒంటరిగ నేగు నభిసారికల హృదయస్పందనము లొకింత యూహింపగలుగుదుమేని, మదనవశంవదలైన ఆ రమణుల కాలి తెన్నుల కనకనికషస్నిగ్ధమైన కాంతి నించుక ప్రసరింపజేసి మార్గమును చూపగలిగితిమేని ధన్యులమే.

ఆ ప్రాచీన భరతఖండమునందలి నదీపర్వతనగరముల నామములు సంతత మెంత రమ్యములు! అవంతి, విదిశ, ఉజ్జయిని, విశాల, రేవ, శిప్ర, వేత్రవతి, చర్మణ్వతి—ఆహా! ఈ నామములయం దేదో యనిర్వాచ్యమైన శోభ, సౌంద ర్యము, మాధుర్యము గలవుకదా! నాటినుండియు ఆ భాష ఆ వ్యవహారములు, ఆ విలాసములు క్రమముగ జీర్ణించి అప భ్రంశమును బొందినవికాబోలు. నేటి నామకరణములుగూడ నట్టి విపర్యయములలోనివే. ఆ రేవా శిప్రా నిర్వింధ్యానదీ ప్రాంతములనున్న అవంతీ విదిశా విశాలాపురముల నెట్లైన నొక్కసారి ప్రవేశించి ఆ పూర్వలక్ష్మీశోభాదర్శనముచే నొక్క ముహూర్తమాత్ర మానందింపగలమేని నేటి పట్టణ విక్షోభములనుండి విముక్తిపొందగలుగుదుము. కాని,యక్షుని మేఘము ఏయే గిరిసరిన్నగరములమీదుగా విశ్రమించుచు, క్రీడించుచు, వినోదించుచు సంచరించెనో, ఆ మజిలీలగుండ విరహకాతరుడగు పాఠకుని దీర్ఘనిశ్వాసములు నేడు పయ నించుచున్నవి. ఎచ్చట పల్లీవధువులు ప్రేమరసస్నిగ్ధ లోచనలయ్యు భ్రూవిలాసముల నెఱుగరో, పరిచితభ్రూలతా విభ్రమములగు ఎచ్చటి నెఱజాణల పక్ష్మోత్క్షేపములచే కృష్ణశబలప్రభలు కౌతూహలపూర్వకములై యెగురునటు మీటిన మల్లెలవెంటబోవు మధుకరశ్రేణుల సిరిని దొంగిలించు చుండునో-అట్టి కాళిదాసుని భరతవర్షమునకు దూరమై పోతిమి. ఆ కవియొక్క మేఘముతప్ప, నేడచ్చటకు దూతగ నేగుట కింకెవరున్నారు ?

మానవులు సముద్రములో దూరదూరముగ విసరివైచిన ద్వీపములవలె నున్నట్లొక ఆంగ్లకవి వాక్రుచ్చినాడు. ఉన్నతపదమునుండి యీ లంకలను గాంచినచో, ఎవని అభిశాపముననో ఈ భరతఖండము వ్రక్కలై, ముక్కలై వాని మధ్య విలాపరాశి పొంగి పొరలి నురుగులు గ్రక్కుచున్నట్లు తోచును. ఘూర్ణమానాంభోధివంటి యీవర్తమానమునుండి కాళిదాసమహాకవివర్ణితమైన ఆ ప్రాచీనభరతవర్షతలము నొక్కసారి తిలకింపుడు! శిప్రాతీరమున రమణీయములగు శిరీషోద్యానములందు కుసుమముల నేయు నా పుష్పలావికలు, అవంతీనగరచైత్యములందు ఉదయనుని ప్రణయగాధలను వినుపించు ఆ కధాకోవిదగ్రామవృద్ధులు, ఆషాఢమాసపు తొలిమేఘమును ముంగురుల నెత్తిపట్టుకొని కాంచుచు ప్రియసమాగమముకొరకు ప్రాణములను నిలుపుకొనియున్న ఆపధికవనితలు—ఆహా! ఆ నారీనరుల విలాసములలో లీనమై పోవుటకు ఏపాఠకుని హృదయ మువ్విళ్లూఱదు!

మన పూర్వులకు, మనకును నిగూఢమగు సంపూర్ణైక్యత లేదందుమా? ఉన్నను కాలము వారికిని మనకును నిష్ఠురమైన వ్యత్యాసమును కలుగజేసినది. కాని కవికృపవలన నా ప్రాచీనకాలము అమరసౌందర్యములకు ఆటపట్టయిన అలకాపురమైనది మనకు. మనము విరహవిధురమగు వర్తమానమునుండి యీ యలకానగరమునకు ఊహామేఘమును దూతగ పంపుచున్నాము. ఓ అలకానగరీ!

యత్రోన్మత్తభ్రమరముఖరా పాదపా నిత్యపుష్పా
హంసశ్రేణీరచితరశనా నిత్యపద్మా నలిన్యః
కేకోత్కంఠా భవనశిఖినో నిత్యభాస్వత్కలాపా
నిత్యజ్యోత్స్నాః ప్రతిహతతమోవృత్తిరమ్యాః ప్రదోషాః

ఎల్లప్పుడును వసంతమగుటచే ఉన్మత్తభ్రమరములచే ముఖరితములగు పూలచెట్లతోడను, హేమంతాదులయందును పద్మములచే శోభిల్లు తామరకొలంకులతోడను, మొల నూళ్లుగ నాచరించు హంసశ్రేణులతోడను, పింఛములు విప్పుకొని సదా నర్తించుచు కేకలిడు క్రీడామయూరములతోడను శుక్లపక్షములోవలె నెల్లపుడు వెన్నెలచే రమణీయములగు రాత్రిలతోడను ప్రకాశించు నీవు మాకు నేడతీతవైపోతివి. నికడకు మే మెట్లువత్తుము ?

వర్తమానముననే కాదు. సర్వకాలములందు ప్రతి మానవునిలోను అఖాతమగు విరహముగలదు. ఏ ప్రియుని గలసికొన గోరుదుమో, ఆప్రియుడు మానససరోవరతీరమున ఆకైలాసశిఖరమున నివసించుచుండును. అచ్చటకు కేవలము నూహాలను పంపగల్గుదుమే గాని సశరీరముగ బోవుటెట్లు ? ఓ ప్రియుడా ! నీ వచ్చట, నే నిచ్చట. మన మధ్యనున్న అనంతమగు నీ యంతరము నెవరుదాటగలరు ? అనంత కేంద్ర ప్రవర్తియగు ఆప్రియతముని సాక్షాత్కారమునుబొందగలవా రెవరు ? నేడు కేవలము భాషలో, భావములో, ఆభాసలో ఇంగితమున, భ్రాంతియందు, వెలుగునీడలలో, జనన మరణ ముల స్రోతోవేగముల మధ్య, వానియొద్దనుండి యేతెంచు

దక్షిణపవనాంకూరలవమునే మహాభాగ్యముగ నెంచుకొనుచే కాని ఈ విరహాలోకమున నింతకంటె నెక్కువ నెవ రాశింప గలరు.

**భిత్వా సద్యః కిసలయపుటాన్ దేవదారుద్రుమాణాం**
**ఏతత్ క్షీరస్రుతిసురభయో దక్షిణేన ప్రవృత్తాః**
**ఆలింగ్యంతే గుణవతి! మయా తే తుషారాద్రివాతాః**
**పూర్వం స్పృష్టంయది కిల భవే దఙ్గమేభి స్తవేతి.**

[అప్పుడే దేవదారు చిగురాకు పుటంబులవిప్పి ఆ పాలయోడికల నుబ్బు పరిమళమూని, దక్షిణముఖముగా నిచటికి వీచుచున్న మంచుగొండగాలులను ఓ గుణవతీ ! తప్పక కౌగిలింతు, అవి నీశరీరమును ముందుగ తాకెనను తలంపుతో]

ఏమీా, యీా విరహాము ! ఉభయులము, రెండువేళల వియోగవివశులమై విలపించుచున్నాము. మన మిర్వురము నిర్జనగిరిశృంగముల నిలువబడి ఉత్తరపుదిక్కును జూచుచున్నాము. ఉభయులమధ్య ఆకాశము, మేఘములు, సుందర భూమి, రేవ, శిప్ర, అవంతి, ఉజ్జయిని, సుఖసౌందర్యభాగ్య భోగముల చిత్రరచనలు విస్తరించియున్నవి. ఈ రమ్య దృశ్యము లన్నియు ప్రియుని జ్ఞప్తికిదెచ్చుచున్న వేకానిసంయోగమును గూర్చుటలేదు. ఆకాంక్ష నుద్దీపింపజేయుచున్న వే కాని నివృత్తిపరచుటలేదు. ప్రియులమధ్య ఇంత యంతర మేమి? కాని యెన్నడో మన ముభయులము ఏకలోకమున నివసించి, యిప్పు డందునుండి నిర్వాసితులమైతి మను విష

యము మనస్సున స్ఫురించుచుండును. "హృదయమందిరము నుండి నిన్ను బయటకు గెంటిన దెవరు ?" అని ఒక వైష్ణవ కవి పృచ్ఛించుచున్నాడు. ఏమి జరిగినది ? నా హృద్దేశ వాసి బయటికేల వచ్చెనో ? అచ్చట స్థానములేదు కాబోలు ఆ యైక్యమునుండి బాహ్యులమై యొండొరులజూచుకొని నేడు వికలచిత్తుల మగుచున్నాము. విరహమునం దెంత విధురత ! ఆకాంక్షయం దెంత వ్యాకులత! ఉభయులము తిరిగి యేకము కాజాలమా ? ఈదూరమును దాటుదమన్న నీ విశాలభూమి అడ్డు తగులుచున్నదికదా !

శాపాంతో మే భుజగశయనా దుత్థితే శార్జ్గపాణౌ
శేషా న్మాసా న్గమయ చతురో లోచనే మీలయిత్వా
పశ్చాదావాం విరహగణితం తం త మాత్మాభిలాషం
నిర్వేక్ష్యావః పరిణతశరచ్చంద్రికాసు క్షపాసు.

[ఈ దుఃఖము నిరవధికము గాదు. విష్ణుమూర్తి శేష శయనమునుండి మేల్కాంచు నప్పటికి నాకు శాపావసానము కలుగును. శేషించియుండు నాలుగు మాసములును నేత్రములు మూసికొని విరహతాపము నోర్చుకొని జీవించియుండుము. అటుతరువాత నీ విరహావస్థలో తలపోసికొనెడి సకలభోగములను శరత్కాలపు ముదురువెన్నెల రాత్రులలో అనుభవింపగలము.]

ఓ నిర్జనగిరిశిఖరవిరహకాతరుడా ! స్వప్నమున నే ప్రియురాలి నాలింగన మొనర్చుచుంటివో, మేఘముఖమున నే సుందరికి సందేశము బంపుచుంటివో, ఆమెతో నొక

యపూర్వసౌందర్యధామమున నొకానొక శారదపూర్ణిమా రాత్రమున నీకు శాపముతీఱి తిరిగి చిరసంయోగము ఘటిల్లు నని యీ యాశ నీ కెవరు కల్పించిరి ?

**ఇష్టాన్ దేశాన్ జలద విచర ప్రావృషా సంభృతశ్రీ**
**ర్మాభూదేవం క్షణమపిచతే విద్యుతా విప్రయోగః**

[ఓ మేఘుడా ! వర్షలక్ష్మిచే నత్యంతము శోభిల్లుచు నీకిష్టమైన దేశములు తిరుగుము. నీకు నీభార్యయైన మెఱుపు తీగతో వియోగము కలుగక యుండునుగాక.]

ఓ యక్షుడా ! నీకు చేతనాచేతనభేదజ్ఞానము మున్నే పోయినది. ఇపుడు సదసద్వివేకమును గూడ నతిక్రమించి తివా యేమి! నీతోపాటు మేఘునిగూడ కృతార్థునొనర్చు చున్నావు !

---

## పూర్వ మేఘము

తన విధిఁ బ్రాలుమాలి దయి
తా విరహోద్ధతి వర్షభోగ్యమై
చనియెడి భర్తృ శాపమున
సత్త్వము క్రుంకఁగ యక్షుఁడొందు దాఁ
జని వసియించె రామగిరి
సాంద్రనమేరు మహీజ వీథులన్
జనక సుతావగాహ విల
సజ్జల పుణ్య తపోవనమ్ములన్

అమితంబైన వ్యథన్ బ్రియావిరహితుం
డా కాముకుం డమ్మహీ
ధ్రముపైఁ గొన్ని నెలల్ సువర్ణవలయ
భ్రష్టప్రకోష్ఠమ్ము రి
క్తముగన్ ద్రోసి తటోపరిన్ బరిణత
స్తంబేరమప్రేక్షణీ
యము మేఘమ్ము నొకండుగాంచెఁ దొలినా
డాషాఢ మాసమ్మునన్ 2

కని యత డంతరశ్రువయి
కౌతుకమున్ జనింపఁ జేయున
వ్వనధరుమ్రోల నెట్లొనిలు
వంబడి చింతిలెఁ జాలసేపు, నె
మ్మనము సుఖోపభోగులకె
మాఱును మేఘునిగాంచగా నికే
మననగుఁ గౌగిలిన్ వలచు
నంగన దవ్వులనున్న వారికిన్ 3

చేరవకాగ్రొవణము
చేడించుకున్ దనఝ్నేనువార్తలన్
జేరిచి నూమెజీవితము
నిల్ప నతంసు తదంబువాహామున్
గోండిపూనికతోఁగుటజ
గుచ్ఛములన్ గయిసేసియర్ఘ్యమున్
వారనిపేర్మి స్వాగతము
పలికెనువానికి కూర్మిపలుకులన్ 4

ధూమాగ్నిశ్వసనాంబుసంయుతపయో
దుండేడ ! ప్రౌఢేంద్రియో
ద్దామప్రాణితతుల్ వహింపదగు వా
ర్తాసంచయమ్మేడ!యం
చామాత్ర మ్మతడెంచ కాజలధరున్
యాచించె నుత్కంఠతన్
గామార్తుల్ కృపణుల్ జడాజడములన్
నైజమ్ముగా నెయ్యెడన్ 5

జలదేంద్రమంత్రివి కామరూపుడవు దీ
వ్యత్పుష్కలావర్తని
ష్టులవంశ్యుండవు నిన్నెఱుంగుదును పా
థోవాహా! అద్దానఁ దో
య్యాలికిన్ దుర్విధిఁ జేసి దవ్వయిననే
నర్థింతు; నీచార్థనన్
ఫలసిద్ధిన్ గనుకంటె మేలు విఫల
త్వంబుత్తమాభ్యర్థనన్ 6

జలధర! తాపఖిన్నులకు
సంశ్రయమీవె, ధనాధిపక్రుధన్
గలిగెసతీవియోగ మిదె
నాపలు కాయమకున్ వచింపఁ బో
వలయును నీవు బాహ్యావన
వర్తిగిరీశజటాగ్రచంద్రికా
విలసితహర్మ్య మయ్యలక
పేరిటి జక్కులరాజధానికిన్ 7

పవనోఢన్ జనుపెంచునిన్ను బథిక
        స్త్రీడావతుల్ ముంగురుల్
మునివ్రేళ్లన్ బయికెత్తియూఱడిలి యా
        లోకింతు రాకాంక్షతో
ననుబోలెన్ బరదాస్యభగ్నితులై
        నంగాక యింకెవ్వడై
నను నిన్గాంచి వియోగతప్తయగుకాం
        తన్ దానుపేక్షించునా! 8

అదె యనుకూలుడై పవను
        డల్లనవీచుచుఁ బ్రోత్సహించు ని
న్నదె నినదించు చాతకము
        హాయిగ నీకెడమన్ సగంధమై
చదలుపయిన్ బలాకములు
        చక్కఁగ బారులు దీర్చి కంటికిం
పొదవగ గర్భధారణస
        ముత్సుకతన్ నినుఁగొల్చు నయ్యెదే! 9

అనుపమసాధ్వి నీవదినె
వ్యగ్రమతిన్ దినముల్ గణించుచున్
గనబడునీకు నిశ్చయము
గన్పయనమ్ము ఫలించు నెట్లనన్
ప్రణయసమృద్ధమున్ సుమని
భమ్మునునై విరహమ్మునంగఁ ద
క్షణపతయాలువౌ సతుల
స్వాంతము నిల్పును గాంక్ష వృంతమై. 10

వసుమతి నుచ్ఛిలీంద్రము న
వంధ్యముగా నొనరింపజాలు నీ
రసితము నాలకించి శ్రుతి
రమ్యముగా రజతాద్రిదనక్ మా
నసమును జేరు కౌతుకము
నన్ బయనమ్మగు రాజహంస లా
కసమునఁ దోడురాగలవు
గ్రాసముగా బిసపల్లవాగ్రముల్ 11

తొలకరితొల్కరన్ గలిసి
తోయద! యానగరాజు నీపయిన్
గల దృఢమైత్రి వెల్వఱచు
గాఢవియోగజబాష్పసంతతిన్
వెలువడువేళఁ గౌఁగిలిడి
వీడ్కొను మున్నతుఁడైనయీనగున్
సలలితలోకవంద్యరఘు
నాథపదాంకితమేఖలాన్వితున్ 12

అలసినవేళలందు నచ
లాగ్రములన్ దిగి విశ్రమించుచున్
వలసినయప్పుడెల్ల గిరి
వాహినులందు జలమ్ము లానుచున్
జలధర! నీవు పోదగిన
చక్కనిమార్గ ముపన్యసించెదన్
దొలుతఁగ నాపయిన్ శ్రుతిమ
నోజ్ఞముగా వచియింతువార్తలన్ 13

ఈగిరిశృంగమున్ గాని య
దే! చనఁబోలును గాడ్పటంచుఁ జే
తోగతి ముగ్ధసిద్ధయువ
తుల్ వెఱతోఁ దలలెత్తి చూడఁగా
నేగుము సోత్సుకత్వమున
నీరసవన్నిచుళోర్వినుండి ది
ఙ్నాగకరావలేపహర
ణక్రియ నుత్తరదిఙ్ముఖమ్ముగన్ 14

ఎదురుగ వల్మీకమ్మున జ
నించు మణిద్యుతిమిశ్రణమ్ము నా
నదిగో! మనోజ్ఞవాసవశ
రాసనఖండము దర్శనీయమై,
యదుసుతవేషవిష్ణు నసి
తాంగము నుజ్జ్వలబర్హమట్టు ల
య్యది విలసిల్లఁ జేయుఁగదు
నంబుద! నీదు వినీలదేహమున్ 15

నగధర! నీవశేంగితము
పంటనుచున్ బ్రజాహార్ద్రదృక్కులన్
గను భ్రుకుటీవిలాసములు
నేరని జానపదాంగనల్ తమిన్
కనుగొన మట్టివాసనలు
గ్రమ్మెడునట్లుగ నెక్కి మాలమున్
వెనుక కొంకింత తగ్గి యిక
వేగమె యేగు ముదీచిదిక్కుగన్ 16

అడవులచిచ్చు పెజ్జడుల
నార్పిన నెచ్చెలి నీవు మార్గపుం
బడలికతోడఁ జేరఁదల
పై వహియింపడె యామ్రకూటు డే
మ్యోడలను క్షుద్రుడున్ దనసు
హృత్తును దొల్లిటిమేల్దలంచి తా
విడువడు సంశ్రయింప, నికఁ
బేర్కొన నేటికిఁ ద్వాదృశోన్నతున్ 17

పరిణతకాననామ్రములు
పార్శ్వములందుఁ దుఱంగలింపఁగా
శిరమున స్నిగ్ధకైశికరు
చిన్ విలసిల్లఁగ నీవు, తద్గిరిం
బరిసరమందుఁ బాండురము
మధ్య వినీలమునై మహీంపమో
ధరమను నూహతో నమర
దంపతు లింపుగఁ గాంతు రయ్యెడన్ 18

అంచితరీతి నాటవిక
యావతభుక్తనికుంజవీథులం
డించుక మేనుఁ వ్రాల్చి యిక
నేగుము వఱ్ఱిలి వేగ, నాపయిన్
గాంచెదిభాంగమంజరచ
నాపరికల్పితభూతివోలె న
భ్యంచితవింధ్యపాదదృష
దావిషమోర్వివిశీర్ణనర్మదన్ 19

నీరద! వాన్తవృష్టివయి
నేరెడు లడ్డగ మెల్లనై వనీ
వారణతిక్తదానజల
వాసితమై ప్రవహించుతన్నదీ
నీరము త్రావి పొమ్ము నిను
నింగి మరుత్తు కదల్పలేదు ని
స్సారు నధఃకరింత్రు శిర
సా వహియింతురు సారవంతునిన్ 20

హరితము శ్యామలమ్ము నయి
యర్ధవినిర్గతకేసరమ్ములన్
బరగెడి నీపమున్ గని, వ
నస్థలిఁ గచ్ఛములందుఁ గ్రొన్ననల్
విరిసిననేల తాళ్లఁతిని,
విస్తృతదగ్ధవనీతలమ్ములన్
సురభిళభూమిమూర్కొని మ
నోగతిఁ దెల్పును నీవు నీటితుం
పరవిదలించుచున్ జనిన
మార్గము తెల్పును సామజమ్ములున్ 21

కనుచుంబయఃకణగ్రహణ
కౌశలభాసురచాతకమ్ములన్
వినుపథి బద్ధపంక్తులగు
బెగ్గురులన్ గణించి చూపుచున్
స్తనితము సేయ నివపుడు
సంభ్రమమంది తమిన్ బ్రియాంగనా
జనమిడు కౌఁగిలింతలకు
సన్నుతి సేతురు నిన్నభశ్చరుల్ 22

అలయక మత్ప్రియార్థము ర
యమ్మునఁబోవఁదలంచి తేనియున్
జలధర! జాఁగగున్ గకుభ
సౌరభమొప్పెడికొండకొండపై
సలలిత హార్ద్రబాష్పముల
స్వాగతమిచ్చు నెమిళ్ళ కేకలన్
వలనుగ వానివీడ్కొలిపి
సైఁబయన మ్మొనరింపు మేడ్తెరన్ 23

విడిలిన కేతకీముకుళ
వీథుల వెల్లని తోటకంచెలన్,
గడగి కులాయముల్ మలచు
కాకుల నాకుల చైత్యపంక్తులన్
నడుమ వినీలజాంబవవ
నమ్ముల భాసిలు నా దశార్ణ మీ
వడుగిడ; నైననున్ నిలుచు
నయ్యెడ నంచలు కొన్ని నాళ్ళలే 24

విదిశ దిశాప్రసిద్ధమగు
వీడు దశార్ణపురాజధాని యం
దొదవును గాముకత్వఫల
మూర్జితరీతిని నీకు విస్ఫుర
త్స్మెరదురసితమ్ముతోఁ దటస
మీపమునన్ భ్రుకుటిన్ రచించు కెం
పెదవిని వోలెఁ గ్రోలెదవు
వేత్రవతీచలదూర్మికాంబువున్ 25

ఓయిపయోద! నిన్ గలిసి
యుత్సుకతన్ బులకించినట్లు ని
చ్చైయమునద్రి ప్రౌఢసుమ
సంభృతనీపములన్ రహించెడిన్
హాయిగ నిల్వు మయ్యెడ గు
హాల్ గణికారతికేళిగంధమున్
ఛాయక వెల్లడించు విట
వారసముత్కటయౌవనోద్ధతిన్ 26

బడలిక దేరి, వన్యఝర
పార్శ్వవనోద్గతమాధవీలతల్
దొడిగిన మొగ్గలందు నవ
తోయకణమ్ములు చిల్క చెక్కులన్
బడు చెమటల్ తొలంచుకుజ
వాడినయట్టి శ్రవోత్పలాళి నొ
ప్పెడి సుమలావికాస్యముల
కించుక ఛాయయొసంగిపోదగున్ 27

ఎలదిశ కేగుచున్న నది
వక్రపుమార్గమె యైనఁ జూచిపో
ఎలయు నవశ్య ముజ్జయిని
భాసురతత్పురసౌధవీధి వి
తళికు మెఱుంగు కాంతులకుఁ
దత్తర మందుచుఁ బౌరభామినుల్
నలుగడ నింపు దృక్చలవి
లాసము గాంచని జన్మ జన్మమే

చలదూర్మిచ్ఛటసందడిన్ మొరయు హం
సశ్రేణికాకాంచితో
స్ఖలితశ్రీసుభగమ్ముగా నడచుచున్
గన్పించు నిర్వింధ్య ని
ర్మలి నాంబుభ్రమనాభిదోపఁ గను ద
న్మైత్రిన్ రసాంతస్స్థితిన్
దెలుపుం బోడులు జూపువిభ్రమమె యా
ద్యంబైన ప్రేమోక్తి యా

ఒడివల సన్నగిల్లి చిఱు
జాలున నయ్యది తీరవృక్షముల్
విడిచిన జీర్ణపర్ణముల
నెల్లనఁదాల్చివియోగబాధతో
గడరుచుఁజెల్వుఁబ్రోషితుడ
నైన భవత్సుభగత్వ మాట నె
వ్వేడువున దానికార్శ్యముము
పాండుగు నయ్యది చేయగా వలెన్ 30

ఉదయనగాథలన్ నుడువు
చుందు రవంతిని గ్రామవృద్ధులిం
పొదవగ నందుఁజొచ్చి చను
మోయివిశాలకు శ్రీవిశాలక
య్యదిభువిఁ గ్రాలు స్వర్గతుల
కచ్చటఁ బుణ్యఫలమ్ము స్వల్పమా
వగుచునఁ బుణ్యశేషమాత్ర
మైనదివళ్ళకలమ్మొకోయనన్ 31

అటరాయంచలమత్త కూజితములన్
వ్యాపింపగాఁ జేయుచున్
స్ఫుటితాంభోరుహ సౌరభోల్లసితమై
శుంభద్గతిన్ వీచుచున్
బటుచాటూక్తుల వేడునెచ్చెలి వలెన్
ప్రాభాతవేళా గతా
స్ఫుటశిప్రాపవనమ్ము కాంతలకుఁ బా
ఫున్ సౌరత క్లేశముల్ 32

తరళోద్భాసితతారహారములు ము
క్తాస్ఫోటశంఖచ్ఛటల్
హరిదంశూద్గిర దశ్మగర్భములు ప్రో
ద్యద్విద్రుమాంకూరముల్
దొరకున్ గోట్లకొలంది తద్విపణులం
దున్ గాంచినన్ వాని సా
గరముల్ దృగ్గతమౌను గేవలజలై
కశ్రీనిధానమ్ములై 33

ఇక్కడవత్సరాజుహారి
యించెను వాసవదత్త నిక్కడే
యక్కమలాక్షితండ్రిదగు
హాటకతాలవనమ్ముపొల్చె నిం
కక్కడై యానృపేంద్రుని మ
దేభముబంధము తెంచిరెచ్చె నం
చక్కడి విజ్ఞు లాగతుల
కబ్బురపా టొదవింతు రెంతయున్ 34

అక్కడియాకుపచ్చనిహ
యమ్ములు సూర్యునివారువమ్ములన్
ధిక్కృతిసేయు శైలనిభ
దివ్యమదేభములెన్న నీవలెన్
మిక్కిలి వృష్టిమంతయు ల
నిన్ దశకంఠుని కత్తివ్రేటులన్
పొక్కినకాయలే రుచిర
భూషలుయోధభటాళికయ్యెడన్ 35

జలదా! నీవట జాలనిర్గతశిఖా
సంస్కారధూపమ్ములన్
బలుపుం జెంది నెమిళ్లు బంధునిరతిన్
నాట్యోపదల్ వెట్టగాఁ
దలపంబోవు పథశ్రమమ్ము సుమగం
ధస్యంది సౌధమ్ములన్
లలిత స్త్రీపదరాగ చిహ్నితములన్
దల్లక్ష్మి నీక్షించుచో 36

వనధర! భర్తృకంఠరుచి
భాసిలునిన్ భ్రమథుల్ గనంగఁ బెం
పునఁ జని చండికేశ్వరుని
పుణ్యనివాసము చూడు మయ్య త
ద్వనము గదల్చుఁ గల్వపువు
వాసనలున్ జలకేళిఁగామినుల్
మునుకలనింపుతావులును
మోసెడి గంధవతీసమీరముల్ 37

అంగోక వేళ నన్యసమ
యంబునఁ జేరెద వేని నచ్చటే
యుండువుగాక భానుడప
రోదధి గ్రుంకెడిదన్క సంధ్యయం
దిందుకళాధరార్హ్వాణ స
మీాడ్యవిధిన్ బటహాత్వ మూని నీ
మందగభీరగర్జితస
మగ్రఫలమ్మును గాంతు వయ్యెడన్ 38

సలలితనాట్యభంగిమల
స్వర్ణమణీరశనల్ ధ్వనింపగన్
వలయమణిప్రభాఢ్యవలి
వర్తితచామరహస్తలైన రో
మెలతలు నిన్ను గాంతు రలి
మేచకదీర్ఘదృగంచలమ్ములన్
కలితపయఃకణమ్ములు న
ఖక్షతులన్ బడి హాయి గొల్పగన్ 39

తాండవవేళ శర్వుని యు
దగ్రభుజాతరుకాననమ్మునన్
మండలవృత్తి నిల్చి మెయి
నవ్యజపారుణసాంధ్యరాగముల్
నిండ హరింపుమయ్య కిమ
నీయతదార్ద్రగజాజినేచ్ఛ నీ
మెండగుభక్తికిన్ గిరిజ
మెచ్చగ నిర్భయశాంతదృక్కులన్ 40

సరసిరుహాయతాక్షు లట
సాంద్రతమోవృతరాత్రివేళ నె
య్యురకయి రాచబాటఁజను
చుందురు వారికి దారిఁజూపుమా
యొఱసినస్వర్ణరేఖవలె
నుజ్జ్వలమైన తటిన్మహస్సుతో,
నుఱిమిన వానచినుకనను
నూఱక జంకెద రాతలోదరుల్ 41

మెఱయుటచేతఁబల్మరులు
మిక్కిలి స్రుక్కు తటిల్లతాంగితోఁ
బురమునఁబావురాల్ నిదుర
వోయెడి సౌధముపైని నెక్కడేన్
జరిపి నిశావశేషమును
జయ్యన నాయుదయమ్మె పోఁదగున్
ధర సుహృదర్థభారమును
దాల్చిన యుత్తము లాలసింతురా! 42

అనునయవృత్తి ఖండితల
యస్రువులన్ దొలగింతు రత్తఱిం
బ్రణయులు కావునన్ ద్యుమణి
మార్గము వీడు మతండు పద్మినీ
వనజముఖోద్గిరత్తుహిన
బాష్పములన్ హరియింపఁజయ్యనన్
జనును గరావరోధమయి
నన్ జనియించు నసూయ నీపయిన్ 43

నిరమణీయమూర్తి తన
నీటఁబ్రసన్నమనస్సునన్ వలెన్
జేరగ నీడరూపమున
నిన్ గడుహర్షముతోడఁగాంచు గం
భీర సితోత్పలస్ఫురిత
మీనసముచ్చలనేక్షితమ్ములన్
వారిద! పోకు వే! వృథగ
వంచనచేసి తదాపగాసతిన్ 44

దుసికిలి యిట్టె గట్టుపిఱు
దన్ బెడఁబాయు విసీలమా పయో
వసనము నించు కత్తటిని
ప్రబ్బలికొమ్మకయిన్ గ్రహింపగా
వెసఁజని యాహరించి పయి
ప్రేలెడి నీకెటులైన జాగగున్
రసికు డెవండు నగ్నజఘు
నన్ విడనాడ సమర్థు డిద్ధరన్ 45

పటుతరవృష్టిఁ బెల్లుబుకు
పార్థివగంధము దాల్చి నాసికా
పుటములఁజొక్కఁపుర్ రవళి
పుట్టగ దంతిచయంబు మ్రోఁగనన్
అటవిని మేడిపంట కను
వై ప్రసరించెడి శీతలానిల
చ్ఛట లాగి వీచు దేవగిరి
చాయలకేఁగఁదలంచు నీపయిన్ 46

ఆనగమాళినుండును ష
డాననుడయ్యెడఁ గౌసుమాభ్రపున్
మేను ధరించి వ్యోమధుని
నీళుల నార్ద్రములైన మేల్మిపూ
వానలఁదేల్పు మాతడల
వాసవసేనల రక్షసేయ వై
శ్వానరునందు నిందుధర
సంభృతరవ్యతిశాయి తేజమా 47

ఘన! యువలన్ హరేందురుచి
గౌరదృగంచలమైన శచ్ఛిఖిన్
గని నటియింపజేయుము న
గప్రతినాదవివృద్ధగర్జలన్
దరుభవుపైని గ్రొంబెరిమ
దాల్చు నగాత్మజ కల్పకేశపా
శోనిపిచెవిన్ మహోత్పలయ
శోభి తదీయవిధూతబర్హమున్ 48

జలధర! పూజచేసి శర
జన్ముని వైణికసిద్ధదంపతుల్
జలకణభీతి దారిని దొ
లంగిచనన్ జని నీవు ముందటన్
సలలితధేనుసంజ్ఞపన
జన్మయి ధారుణి నాపగాకృతిన్
నిలిచిన రంతిదేవుని వి
నిర్మలకీర్తి గణింపు మింపుగన్ 49

వెన్నుని వన్నెమ్రుచ్చువయి
పేర్చెడినీవు జలమ్ములానగన్
గ్రన్నన వ్రాలఁబెద్దదయి
నన్దవులంచున నునికి సన్ననౌ
తన్నదిధార ఖేచరులు
ధారుణిదాల్చిన మధ్యనీలదీ
ప్త్యన్నవహాక్తికైకగుణ
మట్లుగ జూతురు వాలుచూడ్కులన్ 50

చను మానిమ్నగదాటి భ్రూకుటివిలా
సప్రౌఢిమల్ నేర్చి పె
ల్చిన జెప్పల్ పయికెత్త నీలశబల
చ్ఛాయల్ నభస్సీమయం
దెనయన్ గుందసుమభ్రమానువిచలద్
భృంగద్యుతుల్ గొన్న లో
చనపాళిన్ నినుగాంచు తద్దశపుర
స్త్రైణమ్ము మన్నించుచున్ 51

అవలన్ నీడన్బుజేరి కొల్చ్వుమిక బ్ర
హ్మావర్తదేశమ్ము కౌ
రవరాజన్యరణోగ్రచిహ్నములతో
రాజిల్లు నాక్షేత్ర మం
దవనీశానులమోములన్ నిశితబా
ణాసారముల్ నింపె గాం
డీవి నీవంబుజపాళిపైఁగురియుమా
డ్కిన్ వర్షధారావళుల్ 52

అంచితబంధుమైత్రి సమ
రాస్థ త్యజించినసీరి రేవతీ
చంచలలోచనాంకమగు
స్వాదుసురన్ విడనాడి తాను సే
వించె సరస్వతీజలముఁ
జేర్మినిసీవును సౌమ్య!దాని సే
వించి మనోవిశుద్ధిగను
మింతకు నైల్యము వర్ణమాత్రమే 53

అరయుచువాపయిన్ గనఖ
లాద్రి తుషారనగావతీర్ణయై
సురనది యాకడన్ సగర
సూనుల స్వర్గపుమెట్లపం క్తినా
గిరిసుత భ్రూకుటీరచనఁ
గేరెడినట్లయి ఫేనరాశితో
హరుని శిఖన్ గ్రహించెఁదుహి
నాంశునిషక్తతరంగహ స్తయై 54

వెనుకటిసాముమేన దివి
వ్రేలుచు దిక్కరిభంగి నడ్డమై
వనధర!నిర్మలస్ఫటిక
పాండుతదంబువులానగోరుచోఁ
జనియెడునీదునీడ పడి
జహ్నుతనూజ స్థలాంతరమ్మునం
దినతనుజాతసంగమము
నేర్పడ నొందినయట్లు భాసిలున్ 55

హిమ్మటనీవుజూచె దుప
విష్టమృగమ్ముల నాభిగంధమున్
జిమ్మెడిఱాలతోడ సుర
నిమ్నగఁగన్న తుషారగౌరశై
లమ్మును, మార్గఖేదమెడ
లంగ నిషణ్ణుడవై తదగ్రమం
గమ్ముగఁగాంతు శంభువృష
శృంగవిదారితపంకసామ్యమున్ 56

సరళస్కంధవిఘట్టనోజ్జ్వలదవ
జ్వాలల్ మరుత్స్ఫూర్తి న
గ్గిరికిన్ నొవ్వ ఘటించెనేని చమరీ
కేశావళిన్ గాల్చుచున్,
స్ఫురదాసారసహస్రముల్ కురిసి యు
న్మూలింపు మవ్వేదనల్
పరపీడోపశమప్రధానఫలముల్
గావే! మహత్సంపదల్ 57

శరభములందు సంభ్రమవ
శమ్మున నీపయి కుద్గమించుచో
దొౘగుముదారి, జాటియవి
తోడ్తన గాంచును నంగభంగమున్
గుటిసి యడంచువాఁపయినిఁ
గుండలతో వడగండ్లవానలన్
బరిభవ మొందకుందురొకొ
వ్యర్థపుఁబూనిక వహించువారలన్ 58

అచ్చట నొక్క రాతిపయి
నంకితమైన శివాంఘ్రిచిహ్నమున్
నిచ్చలుకొల్తురిసిద్ధులు వి
నీతుడవై వలగొమ్మ నీవునున్
తచ్చరణాంకదర్శనము
నన్ దనువుల్ వెడఁబాసినంతఁబా
పోచ్చయదూరులై ప్రమథ
యోగ్యపదమ్మును గాంతు రాస్తికుల్ 59

ఘన!యనిలాహతిన్ శ్రుతిసు
ఖమ్ముగ జోలువెదుళ్లు మ్రోయ శం
భునితిగప్రోళ్ల గెల్చుకథ
ముగ్ధగళమ్మునఁబాడ కిన్నరీ
జనము త్వదీయగర్జ ముర
జధ్వనిఁగాఁతె గుహాంతరమ్ములం
దెనయ నటన్ సమగ్రత ఘ
టిల్లు మహానటునాట్యకేళికిన్ 60

నగరాజోపతటమ్మునందుఁగల విం
తల్ జూచుచున్ నీ వుదీ
చిగ, రాయంచల మానసాధ్వము భృగు
శ్రేష్ఠప్రతిష్ఠాపథ
మ్మగు క్రౌంచాద్రిబిలమ్ము వెంబడిని తి
ర్యగ్దైర్ఘ్యశోభన్ జనం
దగునింకన్ బలిబంధనోద్యతముకుం
దశ్యామపాదమ్మనన్ 61

పని యూర్ధ్వంబుగఁగాంచెదీవు సురయో
షాదర్పణోద్దీప్తి రా
వః బాహూచ్చలితస్నుసంధియయి యూ
ద్భాసించుకైలాసమున్
నుపించున్ గుముదావదాతశిఖరా
గ్రంబుల్ నభోవ్యాప్తమై
యచుఘుస్రమ్ము శివాట్టహాసములు ప్రో
వై నిల్చెనోయన్నటుల్ 62

పూని విమర్దితంబయిన
ప్రోజ్జ్వలదంజనకాంతినీవు తత్
సానువుపైని గ్రమ్మికొనఁ
దక్షుణభిన్నమదేభదంతతే
జోనుగవైన యయ్యచల
మంసయుగమ్మున మేచకాంబరం
బూనిన రౌహిణేయుని స
ముజ్జ్వలశోభ వహించు నయ్యెడన్ 63

ఫణివలయాంకమున్ వదలి
భర్గుఁడొసంగినచేయి యూతగాఁ
గోని యగజాత కాల్నడకఁ
గొండపయిన్ విహరింపఁగోరుచో
మునుజని నీవు లోనిజల
మున్ హిమసంహతిజేసి యామెకున్
మణితట మెక్కఁదోడ్పడుము
మల్చి వపుస్సును మెట్లుమెట్లు గన్ 64

కలిసినిదాఘమం దమర
కాంతలు నిన్ వలయాగ్రఘట్టనన్
జలమును వెల్వరించి యటఁ
జల్పుదు రంచితయంత్రధారలన్
బాలుపగుగీముగాఁ విడువఁ
బూననిచో బెదరించు వారి నా
టలను బరాకుతో మెలగు
టన్ గని కర్ణకఠోరగర్జలన్ 65

[illegible]కేసహస్ర పత్త్రజన
కమ్మగుమానస సరమానుచున్
క్షణము సుహేమాద్రి వారణ ము
ఖచ్ఛిదమై పరితృప్తిఁ గొల్పుచున్
వనగిరికల్పవృక్షముల
పల్లవచేలములన్ గదల్చుచున్
జెనుపుగ స్వేచ్ఛనై యనుభ
వింపుము క్రీడలం దన్నగేంద్రమున్ 66

రజతాద్రిపైఁ బ్రియుని
యంకతలమ్మున వ్రాలియున్న శృం
గారవధూటి కోలె నల
కాపురి స్రస్త సురాపగాదుకూ
లోదురుచిన్ రహించు; గుఱు
తుండునునీ కది సౌధవీధిపై
ఇరముగ భ్రబృందమును
నీతరుణమ్మునదాల్చు ముత్యముల్
గూరిచినట్టి ముంగురుల
క్రొంజిగి దాల్చిన కాంతకై వడిన్ 67

# ఉత్తర మేఘము

మెఱపుందీవలవంటికన్నియలు,ను
న్నేమైంద్రచాపమ్ముతో
సరియౌచిత్రములున్ గభీరతరగ
ర్జన్ మించు వాద్యధ్వనుల్
స్ఫురదంతర్జలమీఁదువచ్చు మణిభూ
ముల్ స్వర్లిహాగ్రమ్ములున్
ముదపున్నింపఁదదీయ సౌధములు నిన్
బోలున్ బయోవాహకా! 1

కరమునఁ గేళిపద్మ మల
కమ్ముల మల్లియమొగ్గకూర్పులున్
సురుచిరలోధ్రపుష్పిక ర
జోగతపాండురశోభ మోమునన్
గురవకముల్ జడన్ జెవిని
నూత్నశిరీషము పాపటన్ బయో
ధర! భవదాగమోద్భవ క
దంబ మటన్ బువుబోండ్ల కింపగున్ 2

సతతసుమాంచితద్రుముల
ఝంకృతిసేయును మత్తభృంగముల్
సతతపయోజబంధుర స
రస్సుల నంచలు దీర్చు మేఖలల్
సతతలసత్కలాపశిఖి
సంతతి కౌతుకమొందుఁ గేకలన్
సతతమనోజ్ఞచంద్రిక ని
శల్ జెలువొందుఁదమస్సులేకటన్

కనులనునీరు హర్షమునఁ
గల్గును గల్గదు వేఱురీతులన్
మనసిజతాప మొక్కఁడె క
నంబడుఁగన్పడ వన్యతాపముల్
ప్రణయపుటల్కలందె యెడ
బాటగుఁగాదితరోపపత్తులన్
బనుపడు యౌవనమ్మె పెర
ప్రాయము లుండవు జక్కలం దటన్ 4

సురుచిరచంద్రకాంతమణి
శోభితమై యుడుబింబపుష్పముల్
పరచిన సౌధవీధిపయి
ద్రావుదు రందు వధూసహాయులై
సురతఫలాఖ్యకల్పతరు
సూనజమద్యము జక్క,లల్లనన్
మొరయగ వాద్యభాండముఖ
ముల్ తులఁదూగుచు నీస్వనమ్ములన్ 5

జక్కులముగ్ధకన్నియలు
స్వర్ణదిగట్టునఁగల్పవృక్షపుం
జిక్కని నీడలన్ సలిల
శీతసమీరనిషేవ్యమానలై
చక్కఁగఁగూడి స్వర్ణమయ
సైకతముష్టి నిగూఢరత్నముల్
మక్కువతోడుతన్ వెదకు
మంజులకేళిఁదలిర్తు రచ్చటన్ 6

సడలుటఁజేసి పోకముడి
జాఱినవల్వ రసోద్ధతిన్ బ్రియుల్
వడకెడిచేతితోడ దిగ
లాగుచునుండఁద్రపావిమూఢ ల
ప్పడతుక లొయ్యనన్ విసరి
నైచిన చూర్ణపుముష్టి సూటిగాఁ
బడియు మణిప్రదీపముల
పై నదివ్యర్థమె యౌను నయ్యెడన్ 7

తెరలఁగ నీమటూంగు జిగి
దేరిన యైందవపాదపంక్తులన్
గఁగఁచు మేలుకట్టులకు
గట్టినవా శశికాంతముల్ నిశిన్
సురతగతాంగఖేద మణఁ
చున్ బువ్వుఁబోండ్లకు నామఁదోయశీ
కరములు చిందిఁ తత్ప్రియులు
కౌగిళులన్ సడలింపజేయఁగన్ 8

అనిలప్రేరణచేత నయ్యెడను హా
ర్మ్యాగ్రప్రదేశమ్ములన్
నిరుఁగోల్ కొన్ని మొయిళ్లు జేరి యచటన్
నిక్షిప్తచిత్రమ్ములం
దున స్వీయాంబుకణంబులన్ జిలికి త
ద్దోషంబునన్ జంకుచున్
జను ధూమాకృతి దాల్చి జర్జరములై
జాలాంతరాధ్వమ్ములగన్ 9

తఱుగంబోవని యంతరాలయనిధుల్
ద్దై వారగాఁగాముకుల్
సరసాలాపము లాడుచున్ విబుధవే
శ్యాసంగతిన్, గిన్నరుల్
స్ఫురదుచ్చైర్ధ్వనితోఁ గుబేరయశ మె
ప్పున్ శ్రావ్యకంఠమ్ములన్
వరుసన్ బాడగ సంచరింతు రట వై
భ్రాజాఖ్యకేళీవనిన్ 10

నడకచలింపగా నలక
నద్ధసురప్రసవాలు చెక్కులన్
బొడిచిన పత్రఖండములు
పొల్పగు కర్ణసువర్ణపద్మముల్
జడలసరుల్ కుచద్వయపుఁ
జక్కిఁటి ముత్తెపుఁబేర్లు రాలి యా
పొడుగున వేగుఁబోకఁదెలు
పున్ విటకత్తెల నైశమార్గమున్ 11

ధనదుని చెల్మిఁ జేసి నెల
తాల్పు నిరంతర మందెయుండుటన్
మనసిజు డెంచి సాధ్వసము
నన్ దన తుమ్మెదనారిసింగిణిన్
గొన డిక గార్యసిద్ధిని గ
నున్ విటలక్ష్యములం దమోఘమై
తనరెడి భ్రూకుటీప్రహిత
దర్శనయావతవిభ్రమమ్ములన్ 12

సురుచిరచిత్రవస్త్రములు
చూపుల విభ్రమశోభ గూర్పజాల్
సురయుఁజివుళ్లు పుష్పములు
సుందరభూషణసంపదున్నతుల్
చరణవిలేపయోగ్యమగు
లత్తుక యాసకలమ్ము నయ్యెడన్
సరసిరుహాయతాక్షుల కొ
సంగును గల్పకవృక్ష మొక్కఁడే 13

అందుఁగుబేరహర్మ్యమున
కావల నుత్తరదిక్కునందుఁ గ
గ్గొందువు శక్రకార్ముకము
నోహరతోరణభాసమానము
న్మందిర మద్దరిన్ గనెదు
మత్పతిచేతుల బిడ్డరీతిఁ బె
న్పొందు కరావచేయకుసు
మానతకోమలకల్పకాగమున్ 14

పచ్చలమెట్లత్రోవ దయి
వార విదూరజనాళిపంక్తితో
విచ్చిన కాంచనాంబురుహ
వీథులు గ్రమ్మిన బావి గాంతు వి
వచ్చుటఁదజ్జలమ్ములను
నంచలు కాపుర ముండి దాపునన్
ముచ్చట గొల్పు మానసము
నున్ దలపెట్టవు నిన్ను గాంచియున్ 15

ఆనడబావియొడ్డున స
మంచితనీలమణీమయాగ్రకే
ళీనగముండు స్వర్ణకద
ళీపరిధిన్ వహియించి, దానిపైఁ
గానని ప్రేమ నాచెలికిఁ
గాన నుపాంతములన్ స్ఫురత్తటి
చ్ఛ్రేణులు చిమ్మ నిన్ గని స్మ
రింతు నెదన్ సఖి!దాని నివ్వెఱన్ 16

అక్కడఁగన్పడున్ కురవ
కావృతమాధవిమండపమ్మునున్
బ్రక్క చలప్రవాళ మరు
ణమ్మును నైన యశోక మొక్కడున్
జక్కని కేసర మ్మొకడు,
నావలె త్వత్సఖివామపాదమున్
పుక్కిటిమద్యమున్ వలచుఁ
బ్రోది నెపమ్మున నయ్యె వెంతయున్ 17

వాసికిమధ్యగాఁ దరుణ
వంశసవర్ణమణీప్రకల్పితం
బైన వితర్దిపైన స్ఫటి
కాసనకాంచనవాసయష్టికన్
రే నిమురించు నీనెమిలి
నెచ్చెలి నేరిచి నృత్యమున్ బవల్
నానలినాక్షికంకణని
నాదమనోహరతాళసంగతిన్ 18

పలికినగుర్తులన్ నిలిపి
భావమునన్, గని ద్వారసీమలన్
విలిఖితశంఖపద్మముల
సేవిక పోల్చుము మన్నివేశమున్
వెలవెలఁబోవు నిప్పుడది
నిక్కముగా నట నాదు లేమిచే
జలజము స్వీయశోభ గనఁ
జాలునె సూర్యుడు లేనివేళలన్ 19

కలభతనుత్వఘ్నాని చెలి
కాడ!తటాలున డిగ్గ పీలుగా
నిలిచి మనోజ్ఞ కేళిధర
ణీధరసానువుపై మిణుంగుక్రొం
దళుకుల సామ్యమున్ గనెడి
నవ్యతటిన్మృదుకాంతిదృక్కులన్
సలలితమందిరాంతరము
నన్ నిగిడింపుము మెల్లమెల్లగన్ 20

పలుచని మేనితీరు మొన
పల్కుదు రేణిచలేక్షణమ్ములున్
వలుదచనుంగవన్ గొలది
నమ్రత శ్రోణిభరాన యానమం
దలసత, లోతుపొక్కిలి యు
దంచితబింబపుమోవి లేతకౌన్
గలిగిన చాన యుండు నట
నల్వ సతీవిషయాద్యసృష్టినాన్ 21

మితముగఁ బల్కు నయ్యువిద
మిన్న నెఱుంగుము నాద్వితీయజీ
వితమని, విప్రయోగభర
వేదనఁ జక్కవలేమ కైవడిన్
ధృతిసెడి యొంటిగా విరహ
దీర్ఘములైన దినమ్ములన్ హిమా
హతనళినీవిధమ్మునఁ ద
దాకృతి మాఱిన యట్లు లెంచెదన్ 22

అతిరుదిమ్ముచే నుబికి
నట్టి కనుంగవ వేడియూర్పులన్
ద్యుతి సెడియున్న క్రిందిపెదవి
యొప్పగ హస్తనివిష్టమైన త
త్సతివదనమ్ము ముంగురుల
చాటుననుండి వహించు శర్వరీ
పతి జిగి వాసి నీమఱుగు
పాటున నొందెడి దైన్యభావమున్ 23

మునిగియొప్పూజలందుఁ దల
పోసి యెడందను మత్కృశాకృతిన్
దనరగ వ్రాయుచుండియొ సు
ధామధురోక్తులఁబల్కు శారికన్
గనుచు రసజ్ఞురాల! నిను
గాటపుఁబ్రేముడిఁజూచునట్టి భ
ర్తను నెపుడేన్ దలంతువె యె
దన్ జెపుమంచునో యామె కన్పడన్ 24

ఒడిమలినాంశుకమ్ముపయి
నుంచి విపంచిక నాయభిఖ్యతోఁ
గడగి రచింపఁబడ్డ కృతి
గానముసేయఁదలంచి యశ్రులన్
దడియఁగఁదీవియల్ తుడిచి
తానె రచించినదైన మూర్ఛనన్
దడఁబడు చెందు విస్మృతిని
నన్ స్మరియించుచు మాటిమాటికిన్ 25

గుమ్మముపైనఁ బ్రోవిడిన
క్రొవ్విరులన్ విరహావశిష్టమా
సమ్ములు లెక్కవెట్టి వరు
సన్ భువి నుంచుచో క్రోలుచో మదిన్
గ్రమ్మినయట్టి సౌరతసు
ఖమ్ము కనంబడు నామె విప్రయో
గమ్మన నివ్వె ప్రాయికము
గన్ బువ్వుఁబోడులకున్ వినోదముల్ 26

పనులనుమున్గియుంటను బ
వల్ విరహార్తి గణింప దంత యా
మినులను నిర్వినోదయయి
మిక్కిలి స్రుక్కనటంచు నెంతు గా
వున నడురేయి నేలపయి
బొక్కుచు నిద్దుర దక్కియున్న సా
ధ్వని గని నావచస్సులను
దెల్పుము నిల్చి గవాక్షపాళిపై 27

చిక్కిమనోవ్యథన్ జివురు
సెజ్జను నొత్తిలియుండు దూరపుం
జక్కిఁగళావశిష్టమగు
చందురునాకృతిఁదాల్చి యాఁమె, నే
నక్కడ నుండగా రతుల
నట్టె గతించిన రేయి బాళికిన్
మిక్కిలిదీర్ఘమైన నెటొ
నెట్టును రాల్చుచు వేడిబాష్పముల్ 28

సోరణగండ్లమార్గమున
జొచ్చు సుధాశిశిరేందుపాదముల్
జేరఁగఁబోయి నెయ్యమున,
జెచ్చెర క్రమ్మెను చక్షువున్ వ్యథన్
నిరభరార్ద్రపక్ష్మముల
నెట్టనఁగప్పుచుఁబోలియుండు నా
భీరువు మబ్బులోఁబవలు
విచ్చియు విచ్చని మెట్టతామరన్ 29

గలుకయి వక్షోజకుంకుములను
గండములన్ బడు కుంతలమ్ములన్
సురుచిరపల్లవాధరము
నొంచెడి యూర్పులచేత నట్టిటున్
జరుపుచు స్వప్నజన్య మగు
నాసురతమ్మున కాసచెంది ని
ద్దుర గన నెంచు గాని యది
దుర్లభ మౌ నెపు డశ్రులోడుటన్ 30

విరహదినమ్మునన్ విరులు
వెట్టక కట్టిన దేగి యింక నే
నరుసముతోడ విప్పదగి
నట్టిది, తాకినఁ గ్లేశ పెట్టుచున్
బిరుసయి చిక్కువడ్డదగు
వేణిఁ గపోలమునుండి మాటికా
గరిత విదల్చుచుండును న
ఖమ్ములు ద్రుంచని తమ్మికేలుతో 31

తొడవులుమాని మాటికిని
దుర్భర వేదనతోడ సెజ్జపై
గడగి వహించుచున్ మృదుల
గాత్రము నెచ్చెలి నిన్నుసైతమున్
విడువగజేయుదప్పక య
వేలనవాంబుమయాశ్రుబిందువుల్
పొడముటజాలి ప్రాయికము
పో కడుమెత్తని యంతరాత్మలన్ 32

మానసమందునామె కభి
మానము నాపయిమెండు గాన న
మ్మానినియుండు నవ్విధిని
మద్విరహమ్మున నంచు నెంతు గా
కే నొకయందగాడనని
యిట్లు వచించుట కాదుగాని యీ
నానుడిలోని సత్యము క
నంబడు నీవట కేగి చూచినన్ ౩౩

అలకలు క్రేవచూపులను
వడ్డగఁగాటుకనున్న లేక స
ల్లలితసురానిరాకృతిని
రంజిల కేమరి భ్రూవిలాసమున్
నలినదళాక్షి వామనయ
నమ్మదరున్, శఫరీవిలుంఠనో
చ్చలకుముదక్రియన్ బయినిఁ
ద్వత్సవిధమ్మున నంచు నెంచెదన్ 34

కరరుహచిహ్నదూరమయి
కమ్రనితంబమునందు దుర్విధిన్
బరిచితమౌక్తికావళిని
బాసినదై సురతాంతమందు నేఁ
గరముల నొత్తగాఁదగి సు
ఖస్థితి నొందెడునట్టిదైన భా
సురకదళీప్రకాండసిత
శోభి తదూరువు సంచలించెడిన్ 35

వినుము పయోద! అప్పుడొక
వేళను నాయమ నిద్రవోయినన్
స్తనితము సేయకుండు మొక
జామట వేచి ప్రియుండనైన నన్
గని కల నెట్లొ చేర్చు బిగి
కౌగిట ఆపరిరంభణమ్ము తత్
క్షణగళముక్తబాహులతి
కాదృఢబంధము కాక యుండెడిన్ 36

చెలియను లేపి స్వీయజల
శీకరశీతలవాయుసంగతిన్
సలలితమాలతీముకుళ
సంతతితోడుగ సేదదేరి ని
శ్చలగతిఁ ద్వత్సనాథమగు
జాలము నారయు నామెతోఁ దటి
ద్విలసన ముజ్జగించి ధృతి
పెంపునఁ బల్కుము గర్జితోక్తులన్ 37

వినుముసుమంగళీ!సలిల
భృత్తును, నీహృదయాధినేత కే
ననుగుసఖుండ నెమ్మనము
నందువహించి తదీయవార్తలన్
గొని యరుదెంచినాడ నిట
కున్ ద్వరవెట్టుదు ఖిన్నపాంథులన్
వనితల కీలుగంట్ల నుడు
పన్ జనగా మృదుమంద్రఘోషలన్ 38

అనినన్ మైథిలి పావనిన్ గనినయ
ట్లయ్యింతి మోమెత్తి నె
మ్మన మాత్మ్యైక్యపదమ్మగాఁగను నిన్
మన్నించు నేకాగ్రతన్
విను నాపై, జవరాంద్రకున్ బ్రియసఖుల్
నెయ్యమ్మతోఁదెల్పు భ
ర్తృనిజోదంతము తత్సమాగమముకం
టెన్ గించి దూనమ్మగున్ 39

అయుష్మంతుడ! నాదుకోర్కెపయి నీ
యాత్మోపకారార్థమున్
నాయిల్లాలికిఁదెల్పు రామగిరి ను
న్నాఁడంచు నీభర్త నీ
కై యల్లాడుచు నుండెనంచు విన
గా నాశించు నీక్షేమమం
చాయీపల్కె యయత్నితార్తులకుఁ బూ
ర్వాభాష్యమా నెయ్యెడన్ 40

నినువిడినాఁడె దూరమున
నీపతి దైవనిరుద్ధవర్త్మడై
తనువు ప్రగాఢతప్తము ధృ
తశ్వసితోష్ణము బాష్పపూర్ణ ము
స్మనమును నైన తత్తనువు
నన్ సమదీనదశన్ వహించు నీ
తనువునఁజేరి యేకమగుఁ
దానె యెఱుంగు మనోరథమ్ములన్ 41

చెలియలప్రోలఁజెక్కిలి స్పృ
శించెడి కోరికతోడ బిట్టుగాఁ
బలుకఁగఁదగ్గదేన్ జెవిని
వాకొను నీప్రియు డిప్పుడయ్యొ!నిన్
గలియను బల్కరింపగను
గాంచనులేక విరాళిబాళిలో
వలపులుజిమ్మఁగూర్చినది
పల్కరించుగను మన్ముఖమ్మునన్ 42

అంగరుచిన్ బ్రియంగులత
లందు విభీతమృగేక్షణమ్ములన్
మంగళదృక్ప్రసారమును
మంజుముఖచ్ఛవి చంద్రునందు సా
రంగకలాపమందుఁగురు
లన్ దనువీచికలందు భ్రూలతా
భంగిమ నెంతు నయ్యొ!యొక
పట్టున నీకెనలేదె కోపనా! 43

పొలయల్కన్ వహించి యున్నయటులన్
బూఁబోఁడి నీచిత్రమున్
శిలపై ధాతువులన్ లిఖించి యిక మ
చ్చిత్రమ్ము నీకాళ్లపై
నెలమిన్ వ్రాలినటుల్ లిఖించుటకు య
త్నింపంగ బాష్పోద్ధతిన్
గలుగున్ దృష్టినిరోధ మాకలయి కై
నన్ దైవ మోర్వండహో! 44

కలయందున్ గని యెట్టకేలకు నినున్
కౌగింట బంధింపగా
నలివేణీ! తమితోడ నాకసమునన్
హస్తద్వయిన్ జాచుటల్
స్థలదైవౌఘముగాంచి జాలిగొని యం
తర్వ్యాప్తి నెంతేనియున్
గలయన్ జెట్లచివుళ్లపై విడుచు ము
క్తాస్థూలబాష్పాంబువుల్ 45

సరళతరుప్రవాళపుట
సంతతి చీలిచి యప్డై,తత్పయః
పరిమళవాసితమ్ములయి
పైకొని వీచుచు దక్షిణమ్ముగాఁ
దిరిగిన యాతుషారగిరి
తెమ్మెరమొలకలు మున్ను నీమెయిన్
దరిసి స్పృశించి యుండునను
నమ్మిక వానిఁబరిష్వజించెదన్ 46

ధారాసిక్తధరాస్థలీసురభిళ
త్వద్క్త్రిమున్ బాసి యే
దూరానన్ గృశియించి యున్నను సుమా
స్త్రింజేచుచున్నాడు న
న్నారా! యేకరణిన్ సహింతునో నిదా
ఘాంతమ్మునన్ నల్గడల్
ధారాభ్రమ్ములు గ్రమ్మ నెండపొడ దా
ల్పన్ రాని ఘుస్రమ్ములన్ 47

ఆయతయామముల్ గల త్రి
యామ క్షణమ్ముగ నెట్లువేగునో
స్ఫాయదహస్సుకూడ నని
శమ్మెటు లుండునో క్రొద్దియొండ నే
మో!యతిదుర్లభంబులగు
నూహాల నీవిరహవ్యథోష్మచే
నాయెద యింక నాశ్రయవి
నాకృతమయ్యెను జంచలేక్షణా! 48

ఎడదగణించి యూహాల న
నేకము నేనయినిల్పినాడ నీ
యొడలు సుమంగళీ!దిగులు
నొందకు నీవును నగ్గలమ్ముగన్
బుడమిని శాశ్వత మ్మటవె
పోసుఖదుఃఖము, లెట్టివారికేన్
దాడరును జక్రనేమిగతి
దొర్లుచుఁబైకినిఁగ్రిందికిన్ దశల్ 49

ఉరగశయానుడైన హరి
యుత్థితుడౌ నెపు డప్డె శాపమున్
విరియును కండ్లుమూసికొని
వెళ్లగఁబుచ్చుము నాల్గుమాసముల్
వరుసగ నెట్లో తీర్చికొన
వచ్చు వియోగపుఁగాంక్షితమ్ములన్
బరిణతచంద్రికోల్లసిత
భవ్యశరన్నిశలందు నెచ్చెలీ! 50

పలికెనునింక,నీవు మును
బాన్పన నాకవుగింట నిద్రలోఁ
గలవరమంది సస్వరము
గన్ విలపించుచు లేచినావు నే
పలుమఱు పృచ్ఛసేయ కిత
వా! కలలో నిను నన్యకాంతతోఁ
గలిసి రమించుచున్నటులఁ
గాంచితినంటివి లోనినవ్వులన్ 51

వనజదళాక్షి! ఈగుఱుతు
బట్టి గ్రహింపుము నన్ను క్షేమవం
తునిగను శంకసేయకు న
నున్ విని కైతవలోకవాదమున్
ప్రణయము లంతరించునెడ
బాటున నందురు కాని భోగ్యతన్
గనని కతమ్ము చేత నవి
గాంచు రసోపచితి న్నిజేష్టులన్

విరహమునొంది తొల్తగఁద
పించెడి నీచెలి నూఱడించి యా
హారవృషభావదీర్ణశిఖ
రాగ్రమహీధ్రమునుండి చెచ్చెఱన్
మఱలుము నీ వృషశ్శిథిల
మాఘ్యమువంటి మదీయప్రాణమున్,
గుఱుతులతోడి తత్కుశల
గుంభితవార్తలు తెచ్చి నిల్పగన్

హితమతి! బంధుకృత్యము వ
హించెదు నీవని యెంతు నీగభీ
రతకును మారుపల్కు టది
రమ్యముకాదుగ! ఈయవ్వాటు గ
ర్జిత మొనరింపకే జలము
ప్రేముడి చాతకపాళికిన్, సతాం
ప్రతివచనమ్ము యాచకుల
పట్ల నభీష్టము కూర్చుటేకదా! 54

ప్రణయముచేతనో విరహ
భావము నెంచియో జాలి బూనియో
యనుచితమైననీపని మ
దర్థముసేయుము వేడుచుంటి నో
వనధర! వార్షశోభగని
వర్తిలు మింక నభీష్టభూములన్
క్షణ మెడబాటు నీమెఱుపు
కాంతకు నీకును గల్గకుండెడిన్ 54

జలధరపుంగవుండు శ్రుతి
సౌమ్యరవమ్మున దివ్యవాక్కుతో
బలికెఁదదీయవార్తలను
బ్రాణము నిల్పఁగ యక్షకాంతకున్
జెలియును భర్తృవార్త విని
చెందె నెడంద నితాంతహర్షమున్
ఫలము లభింపదే ఘనుని
బ్రార్థనచేసిన నెట్టివారికేన్ 56

సలిలధరోక్తవార్త విని
సౌహృదయమ్మున యక్షరాట్టు తా
నలుక త్యజించి శాపము స
మాప్తము సేయటెకాక యిర్వురిన్
గలిపి నొగుల్ దొలంగగ మ
నఃప్రమదాతిశయమ్ము సేకుఅన్
గలితసుఖోపభోగములు
గల్గగ జేసె యథాపురాస్థితిన్ 57

సమాప్తము